శ్రీరస్తు.

# రాఘవశతకము.

కృష్ణకుమారమిత్రులు

స్నేహలతా కవితాసంఘము,

కొల్లాపురం,

జటప్రోలు సంస్థానం.

శ్రీవైష్ణవ ముద్రాక్షరశాల, పెంటపాడు.

కాపీరైటు.] 1931. [వెల రు 0-2-0.

శ్రీ

కామేశ్వర్యై నమః.

# ఉపోద్ఘాతము.



సీ. జ్ఞానంబునకు మూల • సారమౌ నాత్మ కా
వ్యకవిత్వమని వర్ణ్య • నత్తునడిగి నా
సత్యంబునకు సౌఖ్య • సంఘంబు చేకూర్ప
జాలిన కళయంచు • జాన్సనిమె

నతుల సంగీత ర ♦ సాత్మకంబయిన భా
వాలాపమనుచు గా ♦ శ్లైలు తెలిపి

బ్రితిభావిలాసంబు ♦ వాక్యదేహంబు దా
ల్చిన రూప మనుచు పి ♦ ల్లి వచించె

గీ. హాడ్స నాదిగ నెందఱో ♦ యాంగ్లకవులు
పద్యకవితకుఁగల గౌర ♦ వ ప్రశస్తి
యట్టి దిట్టి దనంగరా ♦ దని సహస్ర
ముఖముల నుతింప వినమొకో ♦ పూర్వమందు.

"రాణా ప్రతాపసింహుని చరిత్ర"

"కవితా యస్తి రాజ్యేన కి" మ్మను వాక్య మీనాడి
నము వచ్చినది గాదు. అది సృష్ట్యారంభమునుండి వెలయు
నమృతవాక్యము. విద్యలలోపల నుత్తమవిద్య కవిత్వమని యా
ర్యకోటిస్వీకరించెను. వాల్మీకిమహాకవి వ్రాయుచున్న సింహళ
ద్వీప మొకసాగరదీవియే యని సూచించినమాట లోకాదృతిఁ
గాంచుచున్నది. శారదాపుంరూపములనఁదగు కవులు విశ్వమున
నున్నతోన్నతస్థానము నాక్రమించుచున్నారు. సంఘము (Soci-
ety) నందుఁ గవి మొదటివాఁడనియుఁ గసాయి కడపటివాఁ
డనియు నాంగ్లేయులందురు. మహాకవికాళిదాసుమాట యట్లుం

డఁ దద్విరచిత శాకుంతలమునందలి కణ్వాశ్రమ హరిణశాబము
నకుఁగల మౌగ్ధ్యము, నిసర్గసౌందర్యము, భావస్వచ్ఛత, బ్రహ్మ
సృష్టిలోఁ గనుపింపదు. ఒకానొక యాంగ్లేయకవి, యేభాష
యందైనఁ గడపటితరగతి కవికూడ, నాభాషలోఁ బదివేలు
నిఘంటువులు వ్రాసిన పండితునికన్న మిన్నయని స్పష్టముగఁ
దెలిపియున్నాఁడు. భాషాకురువృద్ధ ప్రకృతి తత్త్వరహస్య సర్వ
స్వ మెఱింగి కృతులు వ్రాయు సుకవిమందారులు జగదారాధ్యు
లనుట యతిశయోక్తి కాదు. "రవిగాననిచోఁ గవిగాంచునే
గదా" యనునది మేటిసిద్ధాంతమే. ప్రపంచమంతటిని, ప్రపం

చేతరప్రదేశములఁగూడఁ గవితా నిశాతప్రతిభ, భేదించుకొని పోఁగలదు. కడ కీశ్వరస్వరూప తత్త్వరహస్యములఁగూడ సమీపించఁగలదు.

కవికృతములు కావ్యములు. అందనేక భేదములు. శతకము లొకతరగతివి. ఒకదానికొకఁడు సంబధించక విడివిడిగా నున్న పూవులన్నియు నొకచోఁ జేర్చి కట్టిన హారములవంటి వీశతకసంపుటములు. రసమూరు చలములు. అమూల్యములగు నాభరణములుగల పేటికలు.

శతకములు పరిమాణమునఁ జిన్నవనియుఁ జదువుటకు స్వల్పకాలముగూడ నిలువవనియు, దినదినమును గొల్లలుకొల్లలుగఁ గనఁబడుననియు, గొందఱు పెదవి విఱిచెదరు. కాని యీవాద మంత సమంజసముగఁ దోఁపదు. చిన్నవయ్యును మల్లికలు సర్వజనామోదమును బడయుచున్నవి. వజ్రపుముక్క లెంతేనియు విలువ నలరారుచున్నవి. కొలఁదికాలము మాత్రమే వెలుఁగునదియైనను గర్పూరహారతికన్నఁ బవిత్రమైనదియుఁ గల్యాణసంధాయకమైనదియు వేఱొకఁడు గనుపింపదు. దిన

దినము లభించుచున్నను సూర్యభగవానుని దర్శనము ప్రాప్తవ
డదు. పొత్తము చిన్నదియగా పెద్దదిగా యనిచూచుట పండి
తలక్షణము కాదు. గుణభారమే కాని పరిమాణభారము మన
కవసరము గాదు. కవిత్వమునకు రసపుష్టియు భావసౌందర్యము
మాత్రమే ముఖ్యముగఁ గావలసినవి. ఈకాలమున న్యాయస్థా
నములనుండి వెలువడు శాసననివేదికములు (Law Reports)
పరిమాణమునుబట్టిచూచిన బండికి బరువగును. కాని యందు
లోఁ గలియుగమంతయుఁ గరతలామలకముగఁ గనఁబడునే

గాని, కవిత్వముండదు. పంచేంద్రియసుఖము కాదుగదా! ఏకేం ద్రియసుఖముగూడ నీయఁజాలవు.

ఇదిరాఘవశతకము. కర్తలు కృష్ణకుమారకవులు. కొల్లాపురసంస్థానమున వసించు పిన్నవారు. ఒక్కయుపాధ్యాయు నికడ విద్యనభ్యసించినవారు. బాంధవ్య సోదరత్వములు లేనందునఁ గృష్ణకుమారమిత్రులని మైత్రిప్రధానముగ నామధేయము లుంచుకొనిరి. ఇదియొక కొత్తపోకడయే. వీరి యుపాధ్యాయులముఖమున నీకవులు మాకుఁ బరిచితులు. గ్రంథము

నామూలాగ్రము చూచితిమి. శైలి సరసము. భావములు లలితములు. పద్యములు మంచి బిగిగలిగి యున్నవి. పూలమ్మువాఁడు బుట్టనున్న పూలపై నీళ్ళు చిలకరించునట్లు లందందు నోష్ఠ్యోకారోత్తరము మాత్రము మేము మార్పఁగలిగితిమి. అంతకన్న మాసంస్కరణ మెక్కుడుగ లేదు. విద్యావంతులును చిన్నవారును నగు వీరింకను బెక్కుగ్రంథములు రచించి యాంధ్రభాషామహాదేవి నర్చించి కృతకృత్యులగుదురని మాకోరిక. ఇట్టిప్రతిభావంతులగు యువకుల సంస్థానములవా రాదరించి యందందుఁ

పాఠశాలలలో నీచిన్నిశతకములు పఠనీయములుగ నియమించి వీరిని ప్రోత్సహించిన జనాదరమున కింకను పాత్రులగుదురు. సర్వేశ్వరుఁడు వీరి కాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించి కాపాడునుగాతమని ప్రార్థించుచు నింతటితో నుపరమించుచున్నాము.

ప్రొద్దటూరు,
కడపజిల్లా,
15—౬—1931.

ఇట్లు,
కవిసింహ, అవధానిపంచానన,
రాజశేఖర వేంకటశేషకవులు.



శ్రీరస్తు.

# రాఘవశతకము.

ఉ॥ శ్రీరఘురామ! నీగుణచ • రిత్రము నే శతకమ్మొనర్తు ని
స్సారమొ సారవంతమొ య • సంస్కృతమో శుభమో యదైననీ
పేరున నుండుటన్ గడుప • విత్రముపూజ్యమటంచు నెంచి, నా
నేరమి నెంచబోక కరు • ణించి గ్రహింపను తింతురాఘవా! 1.

ఉ. ఎందఱో సత్కవీంద్రులు ర ♦ చించిన దానిని నీవ దేల వ్రా
యం దలపెట్టినాఁడవని ♦ యందురు కొందఱు నాకదేల? నీ
యందు గలట్టిభక్తిఁ గృతి ♦ యాకృతినిచ్చినదీయహృద్గతా
నందముఁదీర్చుకొంటి; నిక ♦ నన్నవరేమన నేమి? రాఘవా. 2.

చ. చదువఁగనైతినాంధ్రములఁ ♦ సంస్కృతభాషయు శాస్త్రఫక్కి నా
నెదియొ యెఱుంగ, కావ్యముర ♦ చించెదు నైపుణిక్రొత్తత్రోవ, నీ
వదియిదియేదియున్ దెలియ ♦ కౌర! యెటుల్ రచియింతువందువా
వదలితి నెల్లభారము భ ♦ వత్కృపపైఁ దగఁజూడు రాఘవా! ౩.

చ. కరమరుదారుకాంతుల బ్రకాశిలుచుండెడునా సుధాకరున్
శిరమునఁదాల్చి, సర్వమునశింపగజేయుహాలాహలంబునా
హరుఁడుహరించెఁగంఠమున, నట్టులెదోషముఁగప్పిపుచ్చుచున్
సరసగుణంబులన్గొనఁబ్రసన్నులఁబెద్దలనెంతురాఘవా! 4.

ఉ. శ్రీరఘురామ! నాహృదయసీమవిహారముసల్పుచుండి, గం
భీర మనోజ్ఞభావ సుర భీకృత మత్కవితాలతాంతముల్
చారు రసప్రసార విల సన్మకరందధురీ పరంపరా
పూరములొంద, నారచనపూర్ణతనందఘటింపురాఘవా! 5.

చ. కవనమువచ్చినందులకుఁ • గ్రద్దనొ? పందినొ? గార్దభంబునో
స్తవమొనగింపఁ బుణ్యమును య • శంబునుగల్గు నెయంచునీపయిన్
దవిలినభక్తి తత్పరత • దావక కీర్తినుతింతు దాన నా
కవితకు వన్నె వచ్చు, మదిఁ • గల్గినకోర్కెయు దీరు రాఘవా! 6.

ఉ. మోక్షమొసంగు నీచరిత • మున్ గనుఁ భక్తిఁ బఠించినంతఁ బ్ర
త్యక్షర మెన్నొ నీతులకు • నాస్పదమై దనరారుచుండు, ప్ర
త్యక్ష నిదర్శనంబుల న • నంతముగా గనఁజేయు నన్నచో
నక్షయలోక సౌఖ్యముల • నందఁగఁ జేయుట బ్రాతె రాఘవా! 7.

ఉ. నీదు పవిత్రనామము గణించుచు యాచనఁ జేతు రర్థులుఁ
నీదగు నామమున్ మొదట నిల్పి లిఖింతురు లేఖకోత్తముల్
నీ దురితాంత నామము నెనెమ్మది నెంచితరింతుర్భక్తులుఁ
నీదగు దివ్యనామము నవనిన్ స్మరియింపఁ డెవండు? రాఘవా! 8.

ఉ. నిక్కపు నీగుణంబులె గణించిన నించుక యాలకింప వీ
వాక్కటి, సర్వమిందతిశయోక్తి యటంచటు గాక మూకనై
యొక్కెడఁ గూరుచుండ మనసొప్పదు, నాకిఁక నేది దిక్కు బల్
చిక్కు ఘటిల్లె నెట్లు దరిఁ జేరుదునో గనఁజాల రాఘవా! 9.

ఉ. కొందరునిన్నువిష్ణుఁడని♦కొందరు 'గాడ్' యనుచుఁ 'ఖుదా'
యటం, చుం దమిఁగొందఱున్ ప్రకృతి♦సూ వెయటంచును
గొందరందుri. నీ, వందరికన్నిరూపుల మ ♦ హాత్వముఁజూ
పుచు నెల్లవారి నా, నంద పయోధి ముగ్నుల నొ♦నర్చెద
వద్భుతమిద్ది రాఘవా! 10.

ఉ. ఒక్కరు నిర్వికారుఁడని♦యొక్కరు చక్కని వన్నికాడటం
చొక్కరుశంఖ, చక్ర,గద♦లూని వెలింగెడు దివ్యమూర్తియం
చొక్కరుదార,పుత్రికుల♦నొప్పు గృహస్థుడటంచుఁబల్కుచుం
డ్రక్కట! నీస్వభావమెది♦యంచుఁదలంచిభజింతు రాఘవా! 11

ఉ. ఒక్కరు నృత్యగీతముల • నొక్కరు వాద్యవిశేషభంగి వే
రొక్కరు మంత్రతంత్రముల • నొక్కరు పుష్పఫలాక్షతాలిచే
నొక్కరు ముక్కుమూసికొని • యొక్కరు ఘోరవనంబుఁ జేరి నీ
దిక్కని గొల్చుచుందురిది • దివ్యపథమ్మువచింపు రాఘవా! 12.

చ. సనక సనందనాది ముని • సత్తము లెంతటి భాగ్యశాలురో
యనయము నిన్నుఁ జేరి తని • వారఁగ నీపద పంకజంబులన్
ఘనతరమైన భక్తిని మ • నఃకుసుమంబులఁ బూజసల్పి నీ
మనమున నిల్చినారు, ముని • మానసలోకవిహార రాఘవా! 13.

ఉ. దీనులఁ గాతువంట కసి♦దీరఁగ ధూర్తులఁ గూల్తువంట సం
ధానముఁ జేతువంట నిను ♦ నమ్మిన గాదిలి భక్తకోటి కెం
తేని శుభమ్ములీ నిరత♦మిట్టి భవత్సుగుణంబు లెంచ నే
మానిసికైన గానివశ♦మా? వరదా! కరుణాత్మ రాఘవా! 14.

చ. హనుమనుబోలుబంటుహరి♦దశ్వతనూభవుబోలుమిత్రుఁడున్
జనకజబోలు సాధ్వి యును♦జన్మఁడులక్ష్మణుబోలువాఁడు సీ
కెనయగునట్టి సూనుఁడు మ♦హీస్థలి నెందును లేరు లేరటం
చనుయశముఁ గడించినమ♦హాత్ములనేమనిగొల్తురాఘవా! 15.

చ. జనకజఁ గోలుపోయిన వి♦షాదమునన్ బడి స్రుగ్గుచుండు నిన్
గని యిదె జాడఁ దెత్తునని♦ గ్రక్కున నీరధి దాటి లంకకున్
జని, యట సీతఁ గాంచి కల♦ సత్యము దెల్పి ముదమ్ముఁ గూర్చునా
హనుమనుఁ బోలు బంటుగలఁ♦డా! యిల నెందునుఁ గాని రాఘవా! 16

ఉ. నీ వటు లుస్సురంచు సహి♦యింపఁగరాని సతీవియోగ శో
కావృత మానసుండ వయి♦నప్పుడు ధైర్యమొసంగి జానకీ
దేవి నెఱింగి రావణు వ♦ధింపఁగజేసి ముదమ్ముఁ గూర్చు సు
గ్రీవుని వంటి మిత్రుఁడు ధ♦రిత్రి నెవండు గలండు రాఘవా! 17

ఉ. ఎన్నఁడు సూర్యరశ్మి దిల ♦ కింపని కోమలగాత్రి సర్వసౌ
ఖ్యోన్నతులన్ ద్యజించి మధు♦రోక్తుల దన్పుచు నిన్నుఁ గూడిని
ర్భిన్నమనస్కయై విపిన♦వీధులఁ గ్రుమ్మరి పెక్కుకష్టముల్
గన్న త్వదీయకాంత కెన♦గాఁదగు సాధ్వులెవారు రాఘవా! 18

ఉ. 'వద్దుర తమ్ముఁడా! విపిన ♦ వాసము నీ'కనినంత 'నన్న! నీ
యొద్ద వసింపఁ గానన మ♦యోధ్యగ నాకు సుఖాస్పదంబటం
చొద్దిక నిన్నుఁ గూడిఁ విపి♦నోర్వర మిక్కిలి చిక్కులొంది నాఁ
డద్దిర! లక్ష్మణుండతని♦యట్టి సహోదరుఁ డేడి? రాఘవా! 19

ఉ. కైకనుదూరబోక, నధి♦కంబగు రాజ్యము వో మెనంచు లో
వ్యాకుల మందకుండ జన♦కాజ్ఞను నొందలఁదాల్చి సర్వదుః
ఖాకరమైన ఘోర విపి ♦ నాంతర సీమ వసించినట్టి లో
కైకను తాత్మ!నీకుసమ♦మౌసుతుఁడున్నె జగాన రాఘవా!20.

ఉ. పిన్నతనానఁ దాటకను ♦ భీతియొకింతయు లేక ద్రుంచినా
వన్నది చాలుఁజాలు నస♦హాయ పరాక్రమ విక్రమంబునన్
మిన్నవు నీవనంగ: నిటు♦మించిరె చెక్కులు బాలుజిందుబల్
పిన్నవయస్సునన్ భుజన♦భీకరిరక్కసిఁగూల్చిరాఘవా! 21.

ఉ. ఆజిని నొక్క రాచపురు ♦ గైనమిగుల్పక నెల్లరాజులన్
దేజమెల్పరఁ జంపెడు ప్ర ♦ తిజ్ఞ వహించి వధించినట్టి వి
భ్రాజిత శౌర్యునిన్ బరశు ♦ రాముని గర్వమణంచితౌర! నా
రాజులవంశమందెనొక ♦ రాజకుమారుడవౌచు రాఘవా! 22.

చ. అవనిపతుల్ మహోత్తరప్ర ♦ యత్నమొనర్చియు నెత్తలేని యా
శివుని ధనస్సు జుల్కనగ ♦ చేకొని యెక్కిడి ఫెళ్లునన్ మహా
రవము సెలంగ గుండెలద ♦ రన్ సరిరాజులమించి ద్రుంచి వై
భవమున జానకమ్మను వి ♦ వాహమునాడితివీవు రాఘవా! 23.

చ. సిరులను వీడి లక్ష్మణుని ♦ సీతను గూడి ధరాధి పత్యమున్
భరతున కప్పగించి కడు♦భక్తిమెయిన్ జనకాజ్ఞ దాల్చి దు
ర్భర వనవాసమున్ గడపి♦ రావణు గూల్చి పురంబు జేరి రా
జ్యరమ గ్రహించి యేలితివి♦ సర్వులునంతసమంద రాఘవా! 24

చ. నిరతము నీ సమీపమున ♦ నే వసియించు మహానుభావు లే
సరిగ భవన్మహామహిమ ♦ పార మెఱుంగగలేక వెఱ్ఱులై
దిరుగుచు నెట్టులా! యనిమ♦తిభ్రమణంబున మ్రగ్గుచుండ సం
సరణవిమోహతప్తుఁడ, న♦శక్తుఁడ, నే నెటు నేర్తు రాఘవా! 25.

ఉ. నీనిజరూపుఁ గాంచిన ము♦ నిప్రవరుల్ తమలోన ముగ్ధులై
మౌనముదాల్చియుందురను♦ మానముచే నెటుదోచకుండ్రువి
జ్ఞానులు పీరియొద్ద నెటు♦సల్పుదు నిఁ గనజాలు దివ్య సం
ధానము నీ వెదిక్కనుచు♦ నస్మితిసర్వముఁ గూర్పరాఘవా! 26.

ఉ. మల్లెలు జాజులాదిగ సు♦మమ్ముల నీవలనఁ గ్రహించి నీ
పల్లవ పాదయుగ్మముల ♦ భక్తిని మేమవె నిల్పి గొల్వ సం
ఫుల్ల మనోరథుండవయి♦ పొంగి వినాత్మ పదార్థ మేదొ సం
ధిల్లఁగ జేసినట్లుగను♦ తెంచి గ్రహించెదవయ్య రాఘవా! 27.

ఉ. నీదయచే లభించిన వి • నిర్మల పుష్పములే యొసంగ స
మ్మోదమునన్ గ్రహించిపరి•పూర్ణసుఖంబిడునిన్ను భక్తిన
త్యాదరతన్ మనఃకుసుమ • మర్పణజేసి భజించువారికీ
వేదియొసంగిబ్రోచెదో? వ•చింపఁగ నెవ్వరికౌను రాఘవా! 28.

ఉ. గర్భముఁజేరుటాది బలు•కష్టము లోపికతో సహించు నా
విర్భవమొందుదాక నటు • పిమ్మటగూడ సమస్తబాధ లా
యుర్భవతో సమానముగ•నంది తపించెడు తల్లినిన్ గటా
దుర్భరదుఃఖమందిడెడు•దుష్టుఁడెటుల్ సుతుఁడౌను రాఘవా! 29

ఉ. పుట్టినదాది సర్వవిధ ♦ ముల్ తనకంటికి ఱెప్పవోలె నె
ప్పట్టున నేదిసేయుటలు♦భావ్యము యట్టులొనర్చి విద్యలం
దిట్టనొనర్చి బ్రోదిగను♦తీ౯ గసఁజేసెను తండ్రి నెంతయు౯
దిట్టెడుద్రోహిపుత్రుడె?గ♦ణింపఁగశత్రుడుగాక రాఘవా!30.

చ. కొడుకవమార్గవర్తియయి♦కూడనికార్యము లాచరించు వే
ళల జనకుండు వానిని దొ♦లంగగ జేయును దుష్పథమ్ము న
శ్లెడ నెడ పాపకార్యముల ♦ నేనొనరించెను కాలమందు న
న్నడుగగ జేయుమయ్యా!పర♦మోత్తమబుద్ధినొసంగి రాఘవా!31.

చ. తనసుతుఁడెట్టినీచుఁడు, న◆ధర్ముఁడు, పాపుఁడు,దుష్టుఁడైననున్
జనకుఁడు చేరఁదీసి కరు◆ణన్ గనుమాడ్కి, మదీయసద్గురుం
డనసఖుఁటన్న దండ్రియన◆నన్నియు నీవని నమ్మియున్న భ
క్తుననుమారాఘుడంచవల◆ద్రోయక బ్రోవగదయ్య రాఘవా! 32

చ. ధనమును గల్గియున్నపురు◆దగ్గరి బంధులమంచు లేనివా
విని వెలిబుచ్చి నీడవలె◆వీడక వెంటమెలంగు వంచకుల్
ధనమును గోలుపోయి వెత◆లన్ బడువేళ నొకండుగానినా
తనిమొఱనాలకింపడుగ◆దా చెవులుండియుఁగూడ రాఘవా! 33.

ఉ. ఆలునుబిడ్డలంచు బర♦మాప్తులు బ్రాణసమానులంచు చు
ట్టా లనుజన్ములంచు నర♦టా! బడిచత్తురుగాని మిత్తి ప్రా
ణాలను దీయుచో నట క♦నంబడరెవ్వరుఁ డింతజూచిదా
నేలొకొ? మర్త్యకోటిభవ♦మేసతమంచుజరించు రాఘవా! 34.

ఉ. కాశి, గయా, ప్రయాగలును♦కాంచియుఁదిర్పతియంచుమా
నవుల్, దేశములెల్లఁబోయెదరు♦దేవునిగన్గొను వేడ్క వారలా
దేశము లేలబోవలె? మ♦దిన్ నినునమ్మినవారియందె నీ
పేశలమంగళాకృతి యు♦భిన్నగతిన్ వెలుగొందు రాఘవా!35.

చ. మనమున శుద్ధిలేక పలు♦మారులు ధర్మము లాచరించినన్
ధనమునొసంగినన్ సకల♦దానములన్ బొనరించిమించినన్
మునులభజించుచున్న పలు♦నోములునోచిన నయ్యుజాగళ
స్తనములభాతినన్నియువృ♦థాశ్రమహేతులుగాదెరాఘవా! 36.

ఉ. నేనిది చేయువాఁడనని ♦ నిక్కముగా బలుకంగలాఁడె యే
మానవుఁడైనఁగాని, యణు♦మాత్రముకూడచలింపలేఁడునీ
యానతిలేక, నట్టియెడ ♦ నజ్ఞులు కొందరు సర్వకార్య సం
ధానులుతామెయంచుమది♦నమ్మిమదించిచరింత్రురాఘవా!37.

చ. అనుపమభోగభాగ్యవిభ♦వాభ్యుదయుం గని లోకులెల్ల నా
తనికిఁక ఁదక్కు వేమి? కడుఁ♦ధన్యుఁడఁటంచు వచింత్రుగాని యా
మనుజుఁడు గాంచు చింతఁదల♦మా? వివరింప విధాతకైన, క్షో
ణిని సుఖదుఃఖముల్ నిలుప నేర్తువొకంట నెనీవు రాఘవా! 38.

ఉ. అందరు పీఠ మెక్కఁగఁ బ్ర♦యత్నముఁ జేసెద రంతె కాని, వా
రందులగష్టముం సుఖము♦నారయలే రెటుజూతమున్న నా
సందమునున్న, నెప్పుడు మ♦నమ్ము ననేదొ జిగీష యుంటచే
నొందరు నిద్ర, శాంతియును♦నుండదు గాకలనైన రాఘవా!39

చ. మనుజునికర్మలందుఁ బ్రథ • మంబు త్వదీయపవిత్రనామకీ
ర్తినుతియటంచుఁ దిక్కులు ప్ర • సిద్ధనులీనఁగ ధర్మశాస్త్రముల్
వినుతియొనర్చుచుండ, నవి • వేకుఁడనై క్షణమాత్రమేని నీ
మనమున నెంచనైతిఁ గరు • ణాశమియించి భరింపు రాఘవా! 40.

ఉ. సేవయుభక్తిలేక యున • నీ గలకాలము మానవాధముల్
కాపురముండనేమి? నొక • గంటయెచాలు నహీనభక్తి ని
న్నోపిభజించుచుండి పర • మోత్తమకర్మలు సల్పునట్టి వా
రీపుడమిన్ వసింప, నిది • యేగద భేదము రెంట రాఘవా! 41.

ఉ. ఎంచఁగరాని బాధలు ద♦హింప సహింపఁగలేక మానవుల్
చంచలతన్ వహించి గ్రహ♦చారఫలంబని వృద్ధులెట్లు సూ
చించినవట్లొనర్పఁగల♦చిక్కులు వాయునె? బాధఁగూర్చనన్
మించిన ప్రేమఁబ్రోచినను♦నీవస్వతంత్రుఁడవయ్య రాఘవా! 42.

చ. ఉరుతర సౌఖ్యవీచికల♦నూయలలూగెడు కాలమందునన్
మరచితివో? నోరుజారితివొ? ప్ర♦కృతిఁదవశంబుననో యొకప్పుడేన్
స్థిరమతినిన్ దలంపని కు♦చేష్టలు కష్టములొందుచో ననున్
శరణనివీడకెప్డు మది♦నమ్మిభజించెదరెంతొ రాఘవా! 43.

చ. తనువును దాల్చుటాది సుకృ♦తంబె యొనర్చుచు నిన్ భజించు చున్, దినములఁ బుచ్చు భక్తులను ♦ నీదరిఁ జేర్చుటయుండ నెన్నఁడున్
నినుమదినెంచనట్టి యవి♦నీతుల హీనులఁ "పాహి" యన్నవా
రినిగడుఁగూర్మిఁబ్రోతువర♦రే! దయనీయ దెసొమ్ము రాఘవా! 44.

చ. పరమునఁగొల్వుదీరిచి యా♦ పారకృపారస మొల్కు దృక్కులన్
బరపుచు, పెక్కుఘోరము లో♦నర్చిన పాపుల పాతకంబులన్
గరుణ శమించి నీవటులఁ ♦ కౌఁగిట వారిని జేర్చు వేళలన్
దురిత మొనర్పకుండుట యె♦న్యూనతయంచుఁదలంతు రాఘవా.

చ. కరిమొఱనాలకించి దయఁ♦గాంచి, కలట్టిభయంబుఁ బాపి నీ
సురుచిర వాఙ్మరందములఁ♦జొక్కఁగ నాదరణంబుచూపు నీ
కరుణను నాపయిన్ జిలికి♦కాచుట నీకదియేటిలెక్క? యో
ధరణిసుతాప్రమోదకర♦దానవవంశవినాశ రాఘవా! 46.

ఉ. మాధవ!శ్రీహరీ!యనుచు♦మానక గొల్చెడుభక్తకోటి హృ
ద్వ్యధిని దోచి కోరికలఁ ♦ దీర్చి స్థిరంబుగ స్వర్గసౌఖ్య సం
బోధితులన్ బొనర్చెద వ♦పూర్వకృపారస మొల్కఁగాజగ
న్నాథ!త్వదీయభక్తులుగ♦నంగనశక్యము దేది?రాఘవా! 47.

ఉ. కమ్మనిపండ్లు మిక్కిలిసు♦ఖమ్మును హాయినిగూర్చు నీడ వృ
క్షమ్ములు, సత్ప్రభాకరవిశ♦శాంతులు, వర్షమువజ్రి, స్వాదుతో
యమ్ములనదీనదమ్ములన♦యమ్మునుఁ బ్రత్యుపకారవాంఛ లే
శమ్మువహింపకెల్లరకొ♦సంగిత్వదాకృతిఁజాటు రాఘవా!48.

ఉ. సాదరభక్తి నాకుఁగల ♦ శక్తికొలందిని రుచ్యభక్ష్యభో
జ్యాదులఁదోరపండ్లఁబర♦మాన్నముఁబాలను నుంచినాఁడవీఁ
డేదిరొయొయుంచినాఁడుమన♦కేమనిదూరవుఁజూపుఁజూడ కిం
దేదిపసందొ?అయ్యదెభు♦జింపుమ తుష్టిగనీవు రాఘవా!49.

ఉ. దావఁగ నేలనీకడ? యథా◆ర్థముఁ బల్కుచునుంటిఁ బద్యముల్
నీవయి వ్రాయు వేళఁ గను◆నీయ మనోహర కాంతులీను నీ
రూపునె నెమ్మదిఁ గని మ◆రుల్కొని నేనటు సంభ్రమింప, నీ
లోపల డాగు కేల? చప◆లుండని నన్గయికోవె రాఘవా! 50.

ఉ. చిక్కని పండు వెన్నెలను◆శీతమయూఖుఁడు మింటినుండి స
ల్దిక్కులుఁ బిండివోసినటు◆లే వెదజల్లుచునుండు వేళ, నా
రిక్కల నివ్వరేఁ బలుక◆రింతురె? యట్టులె నీవు చూకొఁగిఁ
దిక్కయియున్న చో నితర◆దేవతలంతియు కాదె రాఘవా! 51.

చ. మెరపులు గర్జనల్ గలిగి◆మేఘము లాడుచునున్న వర్షమే
గురియక పోవవచ్చు నినుఁ◆గోరి భజించెడు భక్తకోటిపైఁ
బరగు భవత్కటాక్ష ఘన◆వారిదముల్ కరుణారసమ్ములన్
గురియకరిత్తబోవుటోన◆గూడునె యేదెటులైన రాఘవా! 52

ఉ. దోషులు పండినట్టి తమ◆దుష్టత కెంతయుఁ జింతఁజెందుచున్
'పోషణ జేయుమయ్య! నిను◆మ్రొక్కెదమయ్య!' యటంచు వేఁడ, సం
తోషముతోడ తప్పులను◆దోృయుచు వారలపైనిఁ బ్రేమ పీ
యూషము జిల్కి బ్రోచెదవ◆హాహా! యెవరిట్టులోనర్తు రాఘవా!

ఉ. ఒక్కొక రొక్కభంగి తమ ♦ కోపినరీతి భవత్స్వభావమున్
మక్కువ బోధఁజేసి రయి♦నన్ కలసత్యమెఱుంగలేక నే
దిక్కులు సూచుచుంటిఁగదు♦దీనుఁడనై; యిదమిత్థమంచుస
మ్యక్కృపఁదెల్పిబ్రోవదగ♦దానను దాసుఁడగానొ? రాఘవా!54

ఉ. ఎంతటి విద్యనేర్చిన నొ♦కించుక వేషము వేయకున్న ర
వ్వంతయుఁ గౌరవింపరు, ని♦రక్షరకుక్షులెయైన గౌరవం
బెంతొ యొనర్తురి వేషమున♦నెక్కుడు నేర్పరులైన గౌరవం
బంతయు వేషమందె లయ♦మయ్యెనిఁకన్ గతియేది? రాఘవా!55.

ఉ. కుచ్ఛితమెక్కుడాయె,తను ♦ కూఁతులవృద్ధులకిచ్చుటాయెపై
పెచ్చుగనమ్ముటాయె, వర ♦ విక్రయమేబుధగణ్యమాయె, వి
ద్వాచ్ఛయ మక్రమంబునకుఁ ♦ బాల్పడుటాయె, సధర్మవర్తుల
త్యుచ్ఛయులొటయాయె నయ ♦ యో! కలికాలమునందు
రాఘవా. 56.

ఉ. రాసులురాసులేధనము ♦ రావలె మాకని ముందువెన్కలన్
దోసమటంచుజూడ కేటు ♦ దోచినసట్టులె పాపకర్మముల్
చేసెడినీచులన్ జముఁడు ♦ చిక్కనికత్తులఁజెక్కువేళ న
బ్బా!సహింపలేమనిన ♦ నయ్యోడులాభ?మదేమిరాఘవా!57.

ఉ. లంచములిచ్చు చో విషయ•లాలితసౌఖ్యముఁగోరు వేళ నో
క్కించుకఁ గ్రిందుమీఁదు దిల•కింపక రూకలఁగవ్వలట్లు వె
చ్చించెడుదానకర్ణులనుఁ•జేరిక వీంద్రులు "దేహి" యంచుయా
చించినఁ గుడ్డిగవ్వయును•నీయఁదెగింపర దేమొరాఘవా! 58.

ఉ. దుండగు లర్థసంగ్రహులు•దుష్టులు చోరులు జాగరూకులై
యుండెడివారియిల్లుఁ జొర • నోపనికైవడి, నెప్డు నపప్రిమ
త్తుండగునట్టివాని మదిఁ • దూఱఁగలేవు ప్రపంచవాంఛలా
ఖండలవైభవోన్నతులు•గాని మహేవియుగాని రాఘవా! 59.

చ. ఇతరుల యున్నతిం గని సహింపక వంచనవారి నెట్టులేం
బతితులఁ జేయ నెంచికడు బాములఁగూర్చియు దమ్ముగాంచుదు
ర్మతులతిదుస్స్వభావులధమాధము లేహ్యులు నిందు నందుదు
ర్గతులఁ దపింత్రు గాఁ బ్రతిఫలమ్ముగఁ బెక్కువిధాల రాఘవా! 60.

ఉ. దారినిఁగొట్టువారు, పెడదారినిఁ బట్టెడివారు, నీచు నే
పార భజించువారు, నరహత్యలఁబెక్కులు సేయువారు సం
సారము లార్పువారు, వ్యభిచారమె వృత్తిగఁబూనువార లీ
చేరెడు పొట్టకై యిటులిసీ! కనుగానరొ నర్తు రాఘవా!61.

చ. సదమలపల్లవప్రకర ♦ సంయుతమై, ఫలపుష్పయుక్తమై
హృదయ విరాజితంబగు మ♦హీజము నేలకువంగునట్లు, కో
విదుఁడయిసర్వశాస్త్రముల ♦ పీలిచి పిప్పియొనర్చువాఁడపో
విదళితగర్వుఁడై వినయ♦వృద్ధిఁబ్రకాసిలుచుండు రాఘవా! 62.

చ. జననమునొందుటాయె, భవ♦సాగరమందుమునుంగుటాయె,
నం, దనిశముఘోరకృత్యముల♦నంతముగానొనరించుటాయె, తీ
రనివ్యధలందుటాయె,తుది♦ప్రాణముకంఠముఁజేరుటాయె, ది
క్కనినిను మ్రొక్కుటాయె సద♦యాత్మతిసఁగను బ్రోవ రాఘవా! 63

చ. కలియుగమందు జీవితము ♦ గట్టిగ నర్వదియేడు లందు రె
ట్టులో జనె నిర్వదేడులు, క ♦ ముంగడు చిన్నలమాట నేర మిం
నిల చిననల్వదేడులను ♦ నెట్టుట, నైనఁభవాబ్ధి నిన్నెదన్
దలఁచుచునీదగాదలఁచి ♦ నారము, భారమునీది రాఘవా!64.

చ. జపమును సేయఁగా దగిన ♦ శక్తియునన్ గలలోసిపా ర్త స
త్తపమునొనర్పఁగాఁదగిన ♦ దార్ఢ్యమదంతకుమున్నె సున్న, నే
నిపుడెటునీకుమెచ్చ జర ♦ యింతు? నకించనుఁడంచు నీవునన్
గృపఁగనకున్ననీసహజ ♦ కీర్తికిభంగమురాదె? రాఘవా! 65.

ఉ. సారమటంచు నమ్మి పలు♦సౌఖ్యము లబ్బునటంచు నెంచి సం
సారమునందు మున్గితి న♦ శాశ్వతమంచుఁ దలంప కిప్పుడో
సారసలోచనా! కడువి♦చారము గల్గెను, నన్ను బ్రోవఁగా
భారము నీది సుమ్ము నను♦ పాలనొ నీటనొ ముంచు రాఘవా! 66.

చ. జ్వరమున వ్రేగు వేళ పడి♦శంబె సుఖంబనుచుందురి, దానిచే
బోరిపోరి కుందు నప్డు తల♦పోటును మేలని యెంతు, రిట్లు సు
స్థిరమతివీడి మానవులు♦దీనికిఁ దానికిఁ బ్రాకులాడుచున్
బరగెదరంతె కాని, యొక♦బాధకు నోర్వగ లేరు రాఘవా! 67

ఉ. ఎక్కడ నెట్టిరూపమున • నేతఱి నెయ్యది కాకతప్పదో
యక్కడ నట్టిరూపమున • న త్తఱి నయ్యది యౌనుగాని, దా
మెక్కరణిన్ దలంచిన న • దేవిధమందున నెట్టి కార్యముల్
చక్కబడంగ బోవనుచు • సజ్జను లెంచి చరింత్రు రాఘవా! 68.

ఉ. దోసము లెన్నొ నీయెడలఁ • దుష్టులొనర్చి త్వదీయసత్కీర్తి
పీనరబోయి దీనులయి • వేరుపథ మ్మొకటు లేనివేళ నీ
దాసుల మన్నఁ జేరఁగొని • తద్దయుఁ బ్రోచెదవంట కల్ల కా
కాసురుఁ డేనిదర్శనము • గా కలవిట్టి వవెన్నొ రాఘవా! 69.

ఉ. మానితప్రేమనేలు యుజ♦మానునికై దనప్రాణమీయసుం
తేనియుజింతఁ బూనివెను♦దీయని శ్వానముఁ జూచి మైనన౯
మానవులైనవార లభి♦మానమున౯ దమ నేలు ఊన్నికై
బ్రాణమొసంగ నెప్డు వెను♦కంజను నేయఁ గారాదు రాఘవా.70

ఉ. ఏరికి నెట్టిభోజనము ♦ నీవలెనో యటులిచ్చి మెల్ల౯
బేరిమిఁ దన్నునేర్పుగల♦పెద్దవు నిశ్చయము మిన్నిగంజ లా
హారమొసంగి కుక్కుటము♦నంచితరత్నములిచ్చి యుంచనో
రార! సమానశక్తిగను♦నన్నాసరించెదవీవు రాఘవా! 71.

చ. హృదయమునందునమ్మికవహించిన, వైద్యుడునీరమిచ్చినన్
వదలనిజాడ్యమైనను క్షణంబున నంతెయునొందు, నమ్మికల్
కుదురని వేళలం దమృతకుంభము నెట్టులో దెచ్చియిచ్చినన్
వదలదుస్వల్పజాడ్యమయినన్ భువి నెవ్వరికేనిరాఘవా!72.

ఉ. మిద్దెలనెక్కఁగానరుఁడు మెట్లనొ? నిచ్చెననో గ్రహించు, లే
కెద్దియొ సాయమున్ గొను, నదేవిధి నీదరిఁజేర నెంచువా
రొద్దికనో? భయంబునొ? మహాసక్తినొ? భక్తినొ? కామ
శక్తినో?, విద్దియనో? తపంబునొ? కవిత్వమునో? తగం
గొందురు రాఘవా! 73.

ఉ. జ్ఞానులొనర్ప నెంచుఘన♦కార్యము లంతముదాఁక దాఁక బల్
పూనికఁ జేయకే విడిచి♦పుచ్చరు విఘ్నము లెన్ని యేని బై
పైనిఘటించినుల్కిన, నె♦వండొ యొకండు హరించుచుండినన్
దే నెనుగూర్చుచుండుటను♦ తేఁటులు మానని భంగి రాఘవా!74.

ఉ. ఆర్యులు పల్కుచుండెదరు♦హానిఁ దలంపఁగ రాదటంచు దు
ష్కార్యముఁ జేసినన్ బరులు,♦శాంతముఁ జూపినవారలంతటన్
గార్యము మాని సిగ్గున శి♦రంబుల నెత్తఁగలేక వైరపున్
జర్యల మాని మిత్రులయి♦సఖ్యముఁ గూర్తురుగాదె రాఘవా!75.

ఉ. సత్యమె సద్యశఃకుసుమ ♦ సౌరభముఁ వెదజల్లువాయువీ
సత్యమె సర్వపుణ్యఫల♦సారము, సత్యమె యిందునందునన్
నిత్యము, సత్యమే సకల♦నీతులలోఁ దలలోనినాల్క యీ
సత్యమెసత్యలోకమునొ♦సంగెడిమూలధనంబు రాఘవా!76.

చ. మరచితివృచ్ఛసేయనొక♦మాట, సనాతనులెల్ల సూర్యుఁడే
తిరిగెడినన్నుడు, దానిఁగను♦తింపక నేటిబుధాలి భూమియే
దిరిగెడునంచుఁబల్కుదురు, ♦దీనియదార్థమెఱుంగఁబూనినన్
దిరిగెడిమాదుశీర్షములు,♦దీనిస్వభావము దెల్పు రాఘవా!77

ఉ. కాసొకపైనలేనియెడ ♦ గాసునకై తపియించు, నంతటన్
గాసు లభించెనేని నధి♦కంబగు భాగ్యముఁగోరు నయ్యె దె
ట్లోసముకూడెనేనిమది♦లోఁగనఁడింతయుఁదృప్తిబ్రాణముల్
వాసినఁగానికోరికల♦బాయునో లేదో? యెఱుంగ రాఘవా! 78.

ఉ. కర్మము జాలనష్టు ఘన♦కార్యము లెంతటి న్యాయపద్ధతిన్
నిర్మలమానసుండగుచు♦నేర్పునఁ జేసినఁగూడ నెంతయో
మర్మముతోడ జేసెనను♦మాటయెవచ్చునుగానియక్కటా!
ధర్మము గల్గబోవదుగదా!♦విధిఁదాటవశంబె రాఘవా! 79.

ఉ. సారవిహీన సంసరణ • సాగరతీరము జేర లేకదు
ర్వార గభీరవీచికలఁ • బొల్పడి మున్కలువెట్టుచుండి వే
సారి త్వదీయ దివ్యపద•సారసయుగ్మమె ప్రాపటంచు నిన్
జేరినవారి వీడఁదగు•నే? యిటుచెల్లునె నీకు రాఘవా! 80.

చ. అరయఁగ నీప్రపంచమొక•యంగడి, కాపురపున్ గృహంబె
యూ, పరము, కొనంగనంగడికి•వచ్చుటబోవుటజీవితంబునౌ
సరకగు పుణ్యపాపముల•సమ్మతి నేది గ్రహించు నద్దియే
నరుఁడుభుజించుస్వస్థలము•నన్ విధిదాటఁగ లేక రాఘవా!81.

చ. అనిశము దీక్షతో విభుని♦కన్నను మున్నుగ నిద్రలేచి, యా
తని పదపంకజంబులకుఁ♦దద్దయు భక్తిని మ్రొక్కి యంతటన్
దిన మొనరించు కార్యముల♦దీర్చి, సకాలమునందు భోజనం
బునిచిని జేశుఁతన్పుటమొ♦యుత్తమకాంతలకొప్పు రాఘవా!82.

ఉ. ఎత్తరి నెట్టికార్యమొన♦రించుట భావ్యమొయట్లొనర్చి దా
నత్తకు మామకున్ మగని ♦ కందఱికన్నివిధాల సేవలన్
జిత్తమెలర్పఁజేసి పని ♦ సేయనివేళల నీతియుక్తమౌ
పొత్తముజూచుచున్ దినముఁ♦బుచ్చుటె సాధ్విపథమ్ము రాఘవా!

చ. తరగతియందునుత్తమునె ♦ దండనఁజేయుచుసర్వవిద్యలన్
నెరపెడుదేశికుండటుల ♦ నీవును నీప్రియభక్తకోటికే
తరుగనిబెక్కుకష్టములఁ ♦ దార్చి తపింపగఁజేసి,యంతమం
దరమరలేనిలోకమున♦హాయిగనుంచెదవయ్య రాఘవా! 84.

చ. సుతుఁడననిన్నుబోలుపరి ♦ శుద్ధమనస్కతనుండువాఁడె, పో
బతియననీవుపోలెనొక♦పత్నివెడన్ సుఖమందువాఁడె, భూ
పతియన నీవలెన్ భువిని♦పాలనఁ జేసెడువాఁడెయంచు, నీ
క్షితినెటువంటిధర్మమున♦కేన్ నినుసామ్యముగొందు రాఘవా 85

ఉ. శారదరాత్రులందుఁ గడుఁ జల్లని గాడ్పుల జోలలందుఁ, గా
సారసమీపమందు, నొక చక్కని పూపొదరింటఁ భక్తి నీ
పేరు స్మరించ వారనుభవించు సుఖంబెటు గాంచ నేర్తు? ని
స్సారభవంబె స్వర్గమని చంకలు గొట్టుదు వారు రాఘవా! 86.

చ. సకియను గూడి నొక్కెడ రసాలమహీజము నీడ పచ్చికన్
శుకపికశారికాదుల మనోహరగానరసంబు నానుచున్
సుకముగ నీవు కాలము వినోదముగా నిటు నెట్టుచున్న, మ
మ్మిఁక దయఁగాచు టెప్పుడొ యొకించుక యూహనొ
నర్పు రాఘవా! 87.

ఉ. మానితవేణు వూదుచును • మ్రాఁగనుదమ్ములు వింతసోయగం
బీన విముగ్ధ గోపికల • దే పనిగా తమిమీఱ గానవుం
దేనియ లాని తన్మయత • దేహ మెఱుంగక నుంకునట్టు లో
హో! సవనీతచోరుఁడయి • యాదినకృష్ణుఁడవీ వె రాఘవా! ౮౮.

చ. తనసహజంపురూపు,కుల • దర్పము,హింసనుమాని,లోక మో
హినియయి మోహతాపముస • హింపక పైబడవచ్చినట్టి శూ
ర్పణఖను ముక్కుఁగోసితవు • రా! యిలనేకసతీవ్రతుండు నా
జనకసుతాధవుండనుయ • శంబుజగంబుననిండ రాఘవా! 89.

ఉ. ఒక్కెడఁ గ్రిడసల్పి మఱి • యొక్కెడ ముక్తునుగోసినట్టి నీ
యొక్క విరుద్ధభావముల•నూహయొనర్పఁగ నేన బూనుటల్
"నక్క యునాగలోక"మను• న్యాయ్యముగాదె; భువిన్ జనించి నీ
వెక్కరణిన్ బొనర్చినను • నేదియొ నీతినిబోధ సేతు వం
చొక్కొక వేళ నెంతునిజ• మోయమృతంబొ యెఱుంగ రాఘవా!90.

చ. ఎఱిఁగియెఱుంగ కే శబరి • యొఁగిలిపండులదెచ్చి భక్తి నీ
కరములనుంచెఁ, బ్రేమనవి•గైకొని, నైజమెఱింగియుండియున్
నిరసనభావ మించుకయు• నెమ్మదిఁ బూనక నారగించు నీ
నిరుపమభక్తవత్సలత•నేర్తు నె నేస్తుతియింప రాఘవా 91.

ఉ. మానవులున్న చాయలను ♦ మాటికి భీతిని నిక్కి చూచునా
వానరులేడ, దేవగణ ♦ వైరు లజేయులు మానవాశనుల్
దానవులేడ; నీచరణ ♦ దాసత జేరిముఖం బాతురిలాటఁ గా
దో! నరభుక్కుల౯ గపులు ♦ ద్రుంచిరి పేనులవోలె రాఘవా! 92.

ఉ. కమ్మనిసారమూరు శత ♦ కమ్ములొనర్చి త్వదీయ పాదప
ద్మమ్ముల కిచ్చి మించిన కృ ♦ తార్థులయందున నేరిలో శతాం
శమ్మును గానివాఁడ, నిది ♦ సత్యమ యైనను నన్ను ద్రోయకీ
వెమ్మెయినైనఁ బ్రోవఁదగ ♦ దే? నిను నమ్మితిఁ గాదె రాఘవా! 93.

ఉ. కుంటియొగుడ్డియో!జనని♦కూరిమిముద్దిడుకొంచుబుత్త్రునిం
గంటికి రెప్పవోలె గను ♦ నట్లు; కవిత్వపుధార, శైలియుం
గుంటుచునున్న నాకతిమ ♦ నోహరమై గనుపట్టుఁగాన, మి
న్నంటినసంతసంబునస♦మర్పణఁ జేసితిఁగొన్మ రాఘవా!94.

చ. తిరుపతి వేంకటేశ కవి ♦ ధీవరుశిష్యుఁడు సుబ్బరాయభూ
సురుఁడెగురుండుమాకెపుడు,♦సూరులు“కృష్ణకుమారమిత్త్రు”
లందురుమము, నీదుభక్తులము,♦తోఁచినటుల్ కవనమ్ము వ్రాయుచే
కరముప్రియమ్ముమాకగుటఁ♦గాన్కయొసంగితిమిద్ది రాఘవా!95.

చ. శమముదమంబు సత్యమును • సర్వము నీవనుహాత్మ! సర్వలో
కములనునాక్రమించి త్రిజ • గంబుల నేలెడుచక్రవర్తి వీ
వ,ముగురుమూర్తులకు బఱగు • పావనమూర్తివి నీవకా,సమ
స్తమునినునమ్మినాముభవ • సాగరమీఁదఁగ జేయురాఘవా! 96.

ఉ. కర్తవు సర్వకార్యములు • కాగలవానిగఁ జేయు సర్వభూ
భర్తవు జీవరాసులను • పాలనజేయ సమస్తవర్ణసం
స్కర్తవు నీమహాత్మ్యతను • సన్నుతిఁ జేయఁగమా కుశక్య మే?
యార్తులమమ్మునీదుచర • ణాంబుజదాసుల జేయురాఘవా! 97.

ఉ. ఏయది నీకశక్యము మ • హీస్థలి సర్వసుపర్వలోకముల్
"జే" యని కీర్తిజేసెదరు • చిత్రము నీమహిమంబుజూడ, నే
సాయము లేకలోకముల • సంక్షుభితంబుగఁ జేయు రావణున్
మాయముగఁజేసినావు క్షణ • మాత్రములో జగదీశ రాఘవా! 98.

ఉ ఆరయ నీవు మానవుని • యంశమునందుట యీప్రపంచసం
స్కారము జేయ లోకులకు • సత్యము ధర్మము బోధ సేయ సం
సారములో నికష్టముల • జంక కెదుర్కొనఁదండ్రివాక్యముల్
వారనిభక్తి యుక్తులయి • పాలన సేయుట నేర్ప రాఘవా! 99.

ఉ. అయ్యా! మముఁ మహాపదలఁ • నందఁగఁ జేయుట నీపదంబు ల
త్తయ్యా సుఖంబులియ్యఁగల • కల్పములంచు దలంతుమయ్యా! యే
మియ్యఁగ శక్తిలేకమన • మే భవదంఘ్రులఁ జేర్చినాముమా
కయ్యవినంగదయ్యా! పసి • కూనలఁ బ్రోవఁగదయ్యరాఘవా! 100.

ఉ. ఎందఱో వేలుపుల్ గల ర • దేమిఫలంబగు వారిఁ గొల్వ నీ
వందటిలోన బెద్దవు ద • యానిధి వార్తలఁ బ్రోతువంచు నా
రందఱిఁ జేరఁ బోక భవ • దంఘ్రియుగంబునె నమ్మినాముమా
కొందల పాటుమాన్పి సమ • కూర్పు ననిత్యసుఖంబు రాఘవా 101.

చ. నిరతము నీపదాబ్జములె • నేమముతో జపియించుచుండి, దు
ష్కరవిపినప్రదేశములఁ • గాయలఁ గూరల నారగించుచున్
దొరకని వేళ నాఁకటను • దూపిలి కేవలవాయుభుక్కులై
వరలెడుమౌనులే దయకు • బాత్రులు కారుగదయ్య రాఘవా 102.

ఉ. నేనన నెంతవాఁడ నిటు • నీకృపఁ గోరుట, యుందనట్టి వృ
క్షాన వెలుంగుసత్ఫల మొ • కండుగొనన్ మదినాసబూనుటే
గాన నదెట్లు లభ్యమగు • కల్మషకృత్యుఁడ నన్ను నింక ని
ద్ధానగృతార్థు జేతువొక • దా! యని చింతిలుచుంటి రాఘవా! 103.

ఉ. నమ్మితినీపదాబ్జములె • నాహృదయమ్మున భక్తితోడ, ని
త్యమ్మును బూజసేతు నిను • దప్పక నీచరణంబులాననే
మాయమ్ముఁద్యజింపఁ బోను పర • మంబును నిత్యమునైనయట్టి మో
క్షమ్మునొసంగి శీఘ్రము వి • కల్మషజీవితుఁ జేయు రాఘవా! 104.

ఉ. మ్రొక్కుచునున్నవాఁడ మతి • మ్రొక్కెద మ్రొక్కితి నీపదాబ్జముల్
చక్కని భక్తితోడ పలు • సారు లమైనను నేమి కర్మమో
చిక్కులుబాపకుంటి విఁకఁ • జేసెడి దేది యుఁ దోఁచదయ్యెన
య్యక్కృప నాపయిం బఱపి • మందుని నన్ గృపఁజూడు రాఘవా!

ఉ. కోరముభోగభాగ్యములఁ♦గోరముబంధులమిత్రబృందముల్
గోరముతుచ్ఛసౌఖ్యముల♦గోరము మేమిక నైహికేచ్ఛలన్
గోరముగాక నిన్నె మఱి♦కోరుచునుంటిమి నీపదంబులన్
గూరిమితో భజింప నొన♦గూర్పుము నిశ్చలభక్తి రాఘవా!106.

ఉ. నారదగాత్ర! పద్యముల♦నన్ జను పువ్వులమూఢభక్తియన్
దారముతోడ నేఁడుక యు♦తమ్మను సూదిని, నారుపద్యముల్
హారముగూర్చి, నీదు మెడ♦యందున వేసితిఁ గైకొండె, నా
భారముఁ దీర్చుకొంటి; పయి♦భారము నీయదిసుమ్ము రాఘవా!

ఉ. శక్తికొలంది నీదుపద ♦ సారసముల్ భజియించునట్టి నీ
భక్తులలోనఁ జేర్చి మము ♦ పాలనజేసి కవిత్వమందు మా
వ్యక్తినివృద్ధిఁ జేయుచుఁ బ్ర♦బంధము వ్రాసెడు నేర్పు నిచ్చి, వే
ముక్తినొసంగిప్రోవుము! ప్ర♦పూర్ణముగా దయతోడ రాఘవా! 108.

సమాప్తము.



శ్రీరస్తు.

# రాఘవశతకము

కృష్ణకుమారమిత్రులు

స్నేహలతా కవితాసంఘము,

కొల్లాపురం,

జటప్రోలు. సంస్థానం.

1931.



[వెల రు 0-2-0